శ్రీరస్తు.

శ్రీ ఆంజనేయ దండకము.

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాది
వ్యకాయం ప్రకీర్తిప్రదాయం ప్రశస్తప్రకాయం భ
జేవాయుపుత్రం భజేవాలగాత్రం భజేసూర్యమి
త్రం భజే హం పవిత్రం భజే రుద్రరూపం భజే
బ్రహ్మ తేజం బటంచున్ ప్రభా తంబు సాయం
త్ర మున్నిన్ను సంకీర్తనల్ జేసి నీరూపువర్ణిం
చి - నీకీర్తనల్ బెంచి నీపాద పద్మంబులం గొ
ల్చి నిన్ దల్చి నీమీదనే దండకంబొక్కటిం జేయ
నూహించి - నీమూర్తిగావించి నీసుందరంబెంచి నీదా
స దాసాన దాసుండనై - రామ భక్తుండనై నిన్ను
నే గొలిచెదం - నిన్ను నేదల్చెదం నీకటాక్షంబు
నం జూచితే వేడుకల్ జేసితే - నామొరాలించితే న
న్ను రక్షించితే అంజనాదేవి గర్భాన్వయాదేవ ని
న్నెంచ నేనెంతవాడం దయాశాలివైజూచితే - దాత
వై బ్రోచితే దగ్గరం నిల్చితే తొల్లి సుగ్రీవు కున్మం
త్రివై - స్వామి కార్యంబు నందుండి శ్రీరా
మ సౌమిత్రు లంజూచి వారిన్వి చారించి - సర్వే

వ్వాలి సింజంపి కాకుస్థ వంశ్యుం డయ్యా దృష్టి వి.
క్షించి - కిష్కింధ యేలించి శ్రీరాము కార్యా
ర్థమైలంక కేతెంచియున్ - లంకిణిన్ జంపియున్
లంకయుం గాల్చియున్ భూమిజంజూచి యానంద
ముప్పొంగి - యారయుంగరంబిచ్చి యారత్నముందె
చ్చి శ్రీరాము కుంనిచ్చి సంతోషు లంజేసి - సుగ్రీ
వుడా అంగదా జాంబవంతాది నీలాదులం గూడి -
యా సేతువుం దాటియావానరామూక పెన్మూక లై
దైత్యులం ద్రుంచగా - రావణుం డంత కాలాగ్నిడై
యుగ్రుడై కోరి బ్రహ్మాండ మైనట్టి - యాశ
క్తియుం వేసి యాలక్ష్మణుం మూర్ఛగావించగా నప్పు
డే వేగ సంజీవియుం దెచ్చి సౌమిత్రికింనిచ్చి ప్రాణం
బురక్షించ వా - కుంభకర్ణాదులం వీరాదివీరులంమ
రింబోరి - శ్రీరాము బాణాగ్ని వారందరిం రావణుం
జంపగా - సంతలోకంబు లానందమైయుండి య
వ్వేళలం యవ్విభీషణుం వేడుకం దోడుకన్ వచ్చి ప
ట్టాభిషేకంబు చేయించి - సీతామహాదేవియుందెచ్చి
శ్రీరాముకున్నిచ్చి సంతయోధ్యకున్ వచ్చి పట్టాభిషే

యంకారమిః తేరంచుమన్నించినం- రామభక్తప్రశస్తం
బుగానిన్ను నీనామసంకీర్తనల్ జేసితే- పాపముల్ బా
యవే భయములందిరవే - భాగ్యముల్ గల్గునే సర్వ
సామ్రాజ్యముల్- సకలసంపత్కరముల్ గల్గునో వా
నరాకారమే - భక్తమ్మందారమే పుణ్యా సంచార
యోధీర యోధీర నీవేసమస్తంబు - నీవేమహాజయం నీ
వేమహాఫలముగావెలసి - యీతారక బ్రహ్మమంత్రం
బు పఠియించుచుం స్థిరముగా వజ్రదేహంబునుం దా
ల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామయంచుం మనఃపూ
తమై యెప్పుడుం దప్పకం దల్చునాజిహ్వా యం
దుం- దీర్ఘదేహంబునం త్రైలోక్యసంచారివై రామ
నామాంకితధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబుమ్మం - రౌ
ద్రనిశ్వాసికల్లోల హావీరహనుమంత ఓంకారఓంకార
శబ్దంబులం ననేకభీతిం పిశాచంబులం కామినీ మో
హినీ శాకినీఢాకినీ గాలిదయ్యంబులం - నీమవాలంబు
నంజుట్టి నేలంబడంగొట్టి నీముష్టిఘాతంబులం బా
హుదండంబులం రోమఖడ్గంబులం ద్రుంచి కాలాగ్ని
రుద్రుండవై బ్రహ్మపరిభాభాసితంబయిన నీదివ్యతేజం
బునుం జూచి. రారనాముడు నరసింహాయంచుం ద

యాదృష్టివీక్షించి నన్నేలు నాస్వామి నమస్తే నమో బ్రహ్మచారీ నమస్తే వాయుపుత్రా నమస్తేప్రభాపూర్ణహారీ నమస్తే నమస్తే నమః శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఆంజనేయదండకము సమాప్తము.

శ్రీరస్తు

సూర్యనారాయణదండకము.

శ్రీసూర్యనారాయణా, వేదపారాయణా, లోకరక్షామణీ, దైవచూడామణీ ఆత్మరక్షా, నమో పాపశిక్షా, నమో విశ్వకర్తా, నమో విశ్వభర్తా, నమో దేవతా చక్రవర్తీ, పరబ్రహ్మమూర్తీ. త్రిలోకైకనాథాధినాథా, మహాభూత భేదంబులన్నీ నీవై, పోవు మెల్లప్పుడున్నాసకారా, పద్మినీవల్లభా, వల్లకీగానలోలా, త్రిమూర్తిస్వరూపా, విరూపాక్షనేత్రా, మహాదివ్యగాత్రా అచింత్యావతారా, నిరాకారధీరా, పరాకయ్యయోయయ్య ! తాపత్రయాభీలదావాగ్నిదుర్దాంత, నిర్ధూతనిస్సార గంభీరసంభావితానేక నీకంబులం నాకియే కాకనైచిక్కి యేదిక్కులం గానలే కుండ సున్నాడనీవాడనో తండ్రి జాలియుమానాకటాక్షంబులన్నన్ను వీక్షించి వేగంగృపాదృష్టి చేతన్ము

డిచండాలిశు సారూప్యముం గుంటి యశ్వంబు వారిం
టిచక్రింబు పూర్ణాంశుడై చెండవారాక్షు సాధకు
లంగాంచ కర్మానుసారోగ్ర దోషంబులంమ్రించి కీర్తి
పరితాపంబులన్ మించి నిదానులంగాంచి దృష్టార్థ
ముల్ యిత్తునో దృష్టి వేస్త్రా మహాపాప కర్మాలకున్నా
లయంబైనయీదేహభారంబు భారంబుగానీక సూరో
త్తమాయొప్పులందప్పులం సేవముల్ మానినహ స్రాం
శుడాపట్టినీకీర్తిగీర్తింప నే నేస్తునావ్యాడ తాత్మాదయాళు
త్వముం దత్వముం జూపినాయాత్మ భేదంబులంబాపి పో
షింపనీవంతెనిన్నుంబరికింపసాశేషభాషాధిపుల్ గా
నగాలేరు నీదివ్య రూపప్రభావంబు గాసంగ నేనెంత
నెల్లప్పుడున్ స్వల్ప జీప్రుండ నేనీచుడన్ మహాకష్టుడన్ని
ష్ఠయున్ లేదు నీపాదపద్మంబు లేసాక్షి దుశ్చిత్తముం
బాపి నిశ్చింతుగ జ్జేయవే కామితార్థ ప్రదా శ్రీమ
హాదైవరాయా పరావస్తువైనట్టి మూడక్షరాలన్ స్వ
రూపంబు నీదండకంబిమ్మహిన్ వ్రాయ గీర్తించి వి
న్నన్ మహాజన్మజన్మాంతర వ్యాధిదారిద్ర్యముల్ పోయి
కామ్యార్థములొంగు బంగారు తంగేడుజున్నై ఫ
లించున్ మహాదేవదేవా నమస్తే నమస్తే నమస్తే నమః॥

శ్రీ స్తు .

దశావతారాష్టకము.

అష్టకము- భైరవిరాగము- త్రిపుటతాళము:

శ్రీమదలమేల్మంగనాయక సింధుశయనజనార్దనా।
స్వామినామనవాలకించుము సార్వభౌమదయానిధీ॥

పల్లవి॥

పామరుడ హంకారుడను నేను పాపకర్ముడను కుటిలుడన్। తామసుండను నీచుడను దలచ నాతర మేమయా॥

ఉపపల్లవి.

సోమకుడు వేదములు ముచ్చిలి జొచ్చి అబ్ధిలో లో డాగినన్। స్వామిమత్స్యంబయ్యు దనుజునిజంపితివి ప్రఖ్యాతిగాన్॥
సురలు అసురులు పాలకడలిని దరువ మేరువ క్రుంగనన్॥ వరకమఠమయి గిరిని మోసిన పరమ పురుష పరాత్పరా॥ భీకరంబుగ ధరణి నబ్ధిలో నూకగా ఘర్మాక్షునిన్। సూకరంబయి నాసినణచిన లోకనాయకుడీవెకా॥ హరిని జూపుమటంచుబాలుని అడిగి స్తంభము వ్రేసినన్॥ నరమృగాకృతిదాల్చి దనుజు

నము అడిగితివి మరాహమంగిలా। అడుగుకిందను బలి
ని నణఁచిన •పుడమి యేలిన శ్రీపతీ॥ వార్త కెక్కిన
కార్తవీర్యుల వంచుటను జమదగ్ని వయి। కార్తవీర్యుల
నణచి విశ్వము కాచితివి ప్రఖ్యాతిగాన్॥ రావణు
డు గర్వించి సురులను రమణులను చెరనుంచగా। నీ
వు దశరథ తనయుడై యా రావణునిబోరిగొంటివా॥
అష్టదశ అక్షోణుల కౌరవుల ప్రాణము బాపశ్రీ। కృ
ష్ణుడయి జన్మించి స్త్రీలను క్రీడనేలిన శ్రీపతి॥ అసు
రస్త్రీల మహాత్వమెల్లను అణచుటకు బౌద్ధుండవయి।
బిసరుహాక్షుల వ్రతము జెరచ్చిన •బిందునాద కళాత్మ
కా॥ కల్కి తురగమ్ము నెక్కి కరములతళ్కు బత్తిసా
యుధాల్। గుల్కుచును ఖలులన్వధించిన కల్కిని
ను ప్రార్థించెదన్॥ వురగశైలమునుండిఘంకిణి సురను
ద్రుంచియుగోనుగూర్రు। ర్గిరిని వెలసిన దొరవునిను
నే మరువజాల మహాప్రభో॥ వరను జగన్నాథదా
సుడు తలచిశరణని వేడినన్। వెరపుదీర్చక యున్న
వేమయ వేటరాయ మహాప్రభో॥ నరులు యీ
అష్టకము మరువక స్మరణ జేసిన వారికిన్। సిరులు
నాయుష్య యిహము పరమునుశ్రీని వాసులు యొ

గోదావరిజిల్లా కాకినాడ నగర శ్రీవేంకటే
శ్వర విద్యాసాగర ముద్రాక్షరశాలలో యీరకం
హెడ్డింగుమైపుతో తప్పులులేకుండ, దళసరి కాగిత
ములపైని ముద్రించి చవుకధరలకు విక్రయించబడు
శతకములు వగైరా గ్రంథముల పట్టిక:—

## శతకములు.

నృసింహా। భాస్కర। తాడేపల్లి। వేణుగోపాల
శ్రీవేంకటేశ్వర। దాశరథి। సుమతి। కృష్ణ। దేవకీనం
దన। చెన్నమల్లెశ। జానకీపతి। కాళహస్తి। రామతా
రక। భళిరకర్రి। జయతమారామ। కాళహస్తిలింగ।
వరలక్ష్మీనరసింహా। కస్తూరిరంగ। సూర్యనారాయ
ణ। ప్రసన్నరాఘవ। భద్రాద్రిరామ। సీతాపతి। కుమా
ర। ప్రసన్నాంజనేయ। సంపగిమన్న। దాసపోష। రుక్మి
ణీకల్యాణం। కుమారి। మొదలైన శతకములును। వచన
రూపకములు। నలచరిత్ర। హరిశ్చంద్ర। శశిరేఖ।
గయోపాఖ్యానం। అధ్యాత్మరామాయణం। విశ్వగు
ణాదర్శము। మొదలగునవి గేటుపైమరితో ముద్రిం
చబడు కథలును స్త్రీలకుపయోగించు ౧౦౦ రకముల
పాటలును విక్రయించబడును.

